# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

**Retired Telugu Lecturer, V. T J College, Rajahmundry**


## నవ్యాంధ్ర సాహిత్యంలో కళాసాగరం! నారాయణరెడ్డిగారి నాగార్జున సాగరం!


- శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ, ఎం. ఏ


ఆధునికాంధ్ర సాహితీలతాంగిపికలో ధగధగా మెఱుగులు చెరిగే సాగరం నాగార్జున సాగరం! ఈ గేయకృతి చదివిన వారికి నిజంగా ఇది ఎడారిలో ఒయాసిస్సే అనిపిస్తుంది; ఏం చెప్పబడిందని కాదు, ఎలా చెప్పబడింది అనడంలోనే క్రొత్తదనం కావ్యంలో గోచరించగలదనడానికి ఈకృతియే ఒక ఉదాహృతి. మానవత్వామృతము సందించనట్టి ఏ శిల్పం వ్యర్థమనే, సౌందర్యమే కళకు సంకేత సదృశమనే సత్యాన్ని నిరూపించిన మధుర భావ కాసారం ఈ నాగార్జునసాగరం! ఇట్టి మహత్తర గేయకావ్యాన్ని రచించినది 'తెలుగుతల్లి లలాటికాదీప్తి రేఖ' అయిన డా॥ సి. నారాయణరెడ్డి గారు!

'ఇక్ష్వాకు వంశ క్షితీంద్ర చంద్రులకీర్తి కౌముదులు నల్లడల కలయవిరిసిననాడు' కృష్ణవేణీ తరంగిణి పదాల కింకిణులు త్రిరత్న కావ్యాల దెసలనింపిననాడు, శ్రీపర్వతాగ్రమ్ము సింహళాగత బౌద్ధ భిక్షువుల విజ్ఞాన పీఠమ్మగునాడు, సిద్ధార్థుని విశుద్ధ సిద్ధాంతబీజములు శాఖోపశాఖలై సాగిపోయిననాడు' జరిగింది యీకథ. శ్రీపర్వతాన్ని బౌద్ధ చైత్యములుగా నిర్మించే శిల్పులలో పేరుపొందినవాడు పద్మదేవుడు. అతడు కళాత్మక జీవన మభ్యాసము చేయువాడు. అచటి బౌద్ధుల విశ్వవిద్యాలయములో విద్యార్థిని కాంతిశ్రీ ఆమె ఒకనాడు పద్మదేవుని శిల్పనైపుణ్యాన్ని సందర్శిస్తుంది. అతని కళాత్మకదృష్టికి ఆకర్షిత యౌతుంది. ఆమె సౌందర్యానికి పద్మదేవుడు కూడ ఆకర్షితుడై ఒకరోజు ఆమె రూపాన్ని చిత్రించి తనకళాత్మక భావాలను వెల్లడించి ఆ చిత్రపటాన్ని ఆమె కర్పిస్తాడు. ఆ సమయంలో వారియువురను ఏదో మూగబాధ నమళవిస్తారు ఒకనాడు బౌద్ధమత సిద్ధాంతములను తెలుపు మహాచార్యుని ఘనాఘనస్వనము, పద్మదేవుని మంజుల వేణుగాన శీధువు కాంతిశ్రీ డెందమును డోలాందోళితముసేయగా కడకు పద్మదేవుని చేరుతుంది 'అతడు ఉదయమ్మాయె, ఆమె తేజమ్మాయె' అతడు హృదయమ్మాయె ఆమె భావమ్మాయె' నన్నట్లుగా, అపూర్వ మధురానుభూతులలో వారు తేలడం జరిగింది. విరహిణియు, డోలాందోళిత మానసయు అయిన కాంతిశ్రీకి చెలికత్తె సుజాత ఓదార్పు లభించినప్పటికినీ, 'మానవతయె లోపించిన మతమెందుకు కాంతి నీకు, మతవాసనకానరాని మహితజీవితము గడుపుము. అని పద్మదేవుడు బోధించినను వినజాలక ఒకరకు మహాచార్యుని క్రమశిక్షణకు లోనై అతడు నిర్దేశించిన పథాన్ని అతిక్రమించలేక తాను వలచిన పద్మదేవుని, తనకళామతమైన కళనుగూడ పరిత్యజించి సన్న్యాసిని అయ్యి ఆశ్రమాంతరవాసన తొలగిపోనందున కలలుగనుచు పద్మదేవుని పాదారవిందస్పర్శకై అతని చేతులుచాచి అలసినదై కన్నీరుగార్చి దుఃఖసాగరాన్ని సృష్టించుకుంటుంది. ఏతంవిధమైన కథ సాగరంలో తరంగాలైదు, అన్నట్లు ఇందు భాగాలకు తరంగాలు అని పేరు పెట్టడ ఎంతో సముచితంగా ఉంది. సురతరంగిలోని నురుగులను పురుడించు చిన్నా నుడులతో తరంగాయమానంగా కావ్యకథాసాగరం శృంగారాభిముఖంగా సాగుతూ సాగుతూ హఠాత్తుగా శాంతరససంగమంలో గంభీరంగా వ యాడం ఒక విశేషం!

ఇంకో విచిత్రం ఏమిటంటే పద్మదేవుడు, కాంతిశ్రీ, గురుదేవు, సుజాత నాలుగుపాత్రలనే నాలుగు స్తంభాల కవి ఈ కావ్య సౌధాన్ని నిర్మించ అ చేది. పద్మదేవుడు ఈ కావ్య కథానా యకుడు. ఇతడు కళాత్మకదృష్టి గలవా 'అతడు సామాన్యుడైన నమరకళ క డు,' విశేషించి సౌందర్యాత్మకుడు, విషయాన్నే కవి 'అతని తనువు సు రమ్ము అతనికి కన్పించును ప్రత్యణు నొక సుగపురమ్ము' అని తెలియజేశా ఇతడు ధీరలలితుడుగా కనిపించినా, పోవడకు అంతరాయం కలిగి స సంఘారామాన్ని త్యజించడానికి వెనుదీయని విషయంలోనూ, మతం కళాత్మక దృష్టి గొప్పదని నిరూపి

కథలోనే కాక వర్ణనలలోకూడ ఏర్పడేటా చేయడానికి ప్రథమతరంగంలో సాయంసంధ్యాకాంతుల్ని వర్ణిస్తూ 'బౌద్ధ భిక్షు పటాబద్ధ కాషాయ వస్త్రముల వన్నెలు దిగాంతముల రెపరెపలాడె' అని పలికిన పలుకులు నిదర్శనాలు.

ఇక సంభాషణాత్మకంగా నడిచిన నాటకీయధోరణిని పరిశీలిస్తే ఈ రకమైన రచన కత్తిమీద సాములాంటిది, సాము గరిడీలు చేసిన రచయిత మాత్రమే దీనిని చేపట్టగలడు చేపట్టి విజయం సాధించగలడు, రచనాప్రక్రియలో పట్టిందల్లా బంగారమూ, ముట్టిందల్లా ముత్యమూ చేయగలిగిన డా॥ సి. నారాయణ రెడ్డిగారు నిత్యమూ సినీసాహిత్య పౌరోహిత్యాన్ని చేయుచున్నవారవడంవల్ల ఈ రకమైన రచనలో సిద్ధహస్తులై ఔన్నత్యాన్ని అందుకున్నారనే చెప్పాలి. ఇందలి మాటలు ఒక్కొక్కచోట రసస్ఫూర్తిని కలిగించే తేనెల ఊటలై, పరస్పర స్పష్ట భావ ప్రకటనకు గని ఇటాట లయ్యాయి కొండొకచో భావగర్భితా లయ్యాయి ఇలా అనడానికి చతుర్థతరంగంలోని సుజాతా శాంతిశ్రీల సంభాషణమే నిదర్శనం! కొన్నిచోట్ల చక్కని ఆర్ద్రోక్తు లున్నాయి ఇలా అనడానికి ఈ తరంగంలోని సుజాతా శాంతిశ్రీల సంభాషణమే ఉదాహరణం సుజాత శాంతిశ్రీతో

'నీవు పద్మాప్తాయుడు నిండువెన్నెలతేల
  కృష్ణవేణీతటుల క్రీడించుచుంగురని
మతకత్రుడైన మన్మథపూజ సేతురని
  గుసగుసలు'

అని ఇంకనూ ఏదోపల్కబోవుచుండగా శాంతిశ్రీ మాట్లాడుతున్న సుజాత నాపి ఆమెతో

'—అబ్బ! ఇంక సహించ
  లేను చాలించవే, ప్రియసఖీ!'

అని అచటినుండి లేచపోయెను, పాత్రల మానసిక సంఘర్షణను చిత్రించు నప్పుడు అవసరమగు తెలుకటి సన్నివేశములు సినిమాలో (Flash back) ఫ్లాష్ బ్యాక్ వలె కథను కట్టించినట్టి రచనా విధానం కూడ యిందుండుటం విశేషం! చతుర్థ తరంగంలో పద్మదేవుని తపస్సంభారంతో శాంతి శ్రీహృదయ కుసుమం కొంతసేపు కదలక తలవాల్చియుండగా ఇంతలో

'నీవు సుఖమ్మనెడి ఎండ
  మావికొలను ఆల్లుసాచి
తిరిగితిగా కుదరు గుంపు
  పరితృప్తి వగట నిజము!'

ఇత్యాదిగా బోధించే గురుదేవుని రూపంతో నవడం, ఆమె శిష్య మని 'గురుదేవా గురుదేవా అపరాధమ్మును నిజమ్ముగ నీకపోలమ్ములు వా యించుగోగా' ననడం పైవిషయానికి దృష్టాంతాలు!

ఇక రచనలో జనమూ, జీవమూ, కండ, గుండె, గల పదాలను వాడడంలో కూడ రచయిత పనివాడితనం వ్యక్తమౌతుంది చతుర్థ తరంగంలో సుజాత పల్లెపట్లగా వ్రాయబడిన

ఓహో! నాగుండె
లో చెలువు లుప్పొంగి
చెప్పరలసిన నుడుల
చిప్పివేసెను సుమ్ము
పద్మదేవుడు శాంతి
పతితులై రని సంఘ
మంత వింతగ జూడి
రైయి కూసె కోపఖి'
నీవు వెన్నెలచీర
లే వరింపగ క్షితి
పుల కండ్లలోన ని
ప్పులు పోసిగటులారె'

అనువాక్యాలు తెలుగుజాతీయాలకూ నుడికారాలకూ ఉదాహరణాలు,

ఈకథ బౌద్ధ వాతావరణంలో నడిచిందికాబట్టి ఒకటి రెండుచోట్ల బౌద్ధ మతాచార్యుని బోధలు గలవు, ఆమత బోధలుకూడ జాటిగా హృదయానికి నాటుకునే చక్కనిచిక్కని పలుకుల బింకపు పొంకంతో సాగడం ఒకవిశేషం ఇలాఅనడానికి ఇది ఉదాహరణం -

'అహంకార మను చట్టిగి
  అచ్చముగా వేరుపురుగు
అదిపుట్టిన నాటినుండి
  ఆత్మజ్ఞానమ్ము తరుగు'

ఇక ఒదో విషయాన్ని పరిశీలిస్తే ఇది గేయకావ్యం కనుక ఇందు మాత్రాఛ్ఛందస్సు భావానుగుణభంగిమలతో సహృదయ హృదయంగమంగా రచయితచే వాడబడిందనే చెప్పాలి, పంచమ తరంగంలో పద్మదేవుడు గురుదేవునికడకు వచ్చి 'శాంతిశ్రీకి ఒక్కమాట చెప్పి పోవుద' నని సర్వసంగపరిత్యాగియైన బంధరహితుడైన స్వామి పలికే మాటలను కవికూడా అంతగా ఛందోబంధములేని (వచనముగంటి) గేయంలో తెలియజేయడం పైవిషయానికి తార్కాణం! ఆ గేయ మిది

'తీక్షణ విడబాడు మంచు పేసు
తెలుపుట కోసరమై రాలేదు
ఆమెతో డపలికి ఒక్క మాట
అగుపించనుసుమ్మీ ఇచ్చోట'

కొన్ని గేయాల్లో విశ్వనాథవారి కిన్నెరసాని గేయాల ఫణితి స్ఫురిస్తోం దనడానికి ప్రథమకిరంగంలో పద్మదేవుడు శ్రీ పర్వతాన్ని బౌద్ధగాథలతో శిల్పసుందరంగా తీర్చిదిద్దడాన్ని వర్ణించే గేయం ఉదాహరణం :-

లుంబినీ వనమధ్య
లలిత సాలక్షితిజ
శాఖావలంబనము
సలుపు మాయాదేవి
కడుపుచల్లగ పుడమి
బడి ఏడడుగులుమున్
నడిచి బుద్ధస్వామి
నిలిచె, అతని ప్రతి
అడుగులో అబ్జమ్ము
మొలిచె'

ముక్తిమ్మీద విరక్తికీ రక్తికీ సంఘర్షణమే ప్రధానకథాబీజంగా కలిగి, మానవత్వంలేని మతంకన్నా మానవత్వంకలిగిన కళయే మిన్న' అనే సందేశాన్నిస్తూ, 'సంశయాత్మా వినశ్యతి' అన్న ప్రాచీన సూక్తిని సమర్థించే ఈ నాగార్జునసాగర కావ్యాన్ని ఇంతగా సాహిత్య కళా తంత్రికాద్యుపకృతిమాలికాకృతిగా తీర్చిదిద్ది డా|| సి. నారాయణరెడ్డిగారు ధన్యులైనారు. కవికుల మూర్ధన్యులైనారు.

— —



# ధూర్జటి లోకజ్ఞతకు నిదర్శనంగా తిన్నని కథ

- శ్రీ కె. హెచ్. సుధాకరరెడ్డి, ఎం. ఏ.

ఆదిమమానవుడు పుట్ట మొదట అడవులలోనే నివసించెడివాడట. అతనికి సరిగా భాషయే రానివాడు నాగరికత తెలియక కనీసంవస్త్రధారణమైనా లేనివాడు, అతని జీవనవిధానమే వేరుగా ఉండెడిది. వారు అడవిలో కొందరు కలిసి ఒక్క గూడెం గుంపుగా నివసించెడివారట. వారి ఆహార పదార్థాలు అడవిలోనే దొరుకు పండ్లు నివ్వరి ధాన్యము మొదలగునవి. ఈ విధంగా అనాగరకంగా జీవించినాగూడ వారికి దైవభక్తి మెండు. వారు దేవుని చక్కగా పూజింతురు. జాతరలు చేయుదురు. వారిదేవరకు నరబలులు, జంతుబలులు గూడ జరిపెడివారట, దీనికి ధూర్జటి మహాకవి రచితంబైన శ్రీ కాళహస్తీమాహాత్మ్యము నందలి తిన్నని కథ చక్కటి నిదర్శనము.

తిన్నడు పూర్వ జన్మలో అర్జునుడట. ఇతడు శివుని అనుగ్రహమున తిన్నడుగా జన్మించి శివసాయుజ్యం పొందినాడు ఇతడు పుట్టింది ఒక చెంచు దొరకు. కాబట్టి ఆ చెంచుపిల్లలతోనే చక్కగా ఆటపాటలు నేర్చి, విలువిద్యయందారితేరిన వాడై చివరకు శివుని కటాక్షముతో కరుణింపబడి శివసాయుజ్యం పొందెను. ఈ తిన్నని కథలో ఆటవిక ప్రజల జీవన విధానమ్ము, ధూర్జటి తనప్రబంధంలో తన కాలంనాటి చెంచుల ఆటవిక జీవనవిధానము చక్కగా వర్ణించినాడు. ఇందులో తిన్నడు మిగిలిన పిల్లలతో ఆడుకొను ఆటలు బహుశః రాయల కాలంనాడు అదే వారేమో -

'చిట్ల పొట్లకాయ చిరిపింగ డాలు త్తి
(గుడుగుడు గుంచాలు, బండెనగుడి''
... ... ...

ఇతడు తెల్పిన ఆటలలో నేడు మనకు కొన్ని మాత్రమే కన్పించుచున్నవి. వానిలో కొన్ని గుడుగుడుగుంచాలాట, డాగిలి ముచ్చులాటలు అంటే దాగుడు మూతలు, గచ్చకాయలు, వెన్నెల కుప్పలు, తన్నుబిల్ల, బిల్లగోడు, చెండు గట్టిన కోడి, ఉప్పన బట్టె మొదలగునవి. గుడుగుడు గుంచాట :-

'గుడుగుడు గుంచెం గుండేరాగం
పాములపట్నం ...'

ఈవిధంగా నేడు పాడుచు ఈయాట నాడుదురు.

దాగుడు మూతలాట గూడ నేడు బహుళ జనప్రచారంలోనిది. గచ్చకాయలు - ఈయాట నేడు ఆడపిల్లలు మాత్రం ఎక్కువగా ఆడుదురు. బహుశః నాడు ఆడ మగపిల్లలు గూడ ఆడేవారేమో. వెన్నెలకుప్పలు - ఈయాట నేడు పిల్లలందరు కలిసి రెండు జట్లుగా విడిపోయి ఒకరికి తెలియకుండ ఒకరు ముక్కలు పెట్టుదురు. తర్వాత ఒకజట్టు వారు పెట్టిన కుప్పలు వేరొక జట్టు వారు చెరుపుదురు. అలా పోగామిగిలినవాటిని లెక్కించగా ఎవరివి ఎక్కువగా ఉంటే వారు గెలిచినట్లు దీనిని వెన్నెల రాత్రులందు ఎక్కువగా ఆడుదురు. కాబట్టి దీనిని వెన్నెల కుప్పలు అని యందురు. తన్నుబిల్ల - అంటే నాకొక టన్పిస్తుంది. నేడు కుంటిపిచ్చ అని అడుతారు. ఒక వైపు 4 వేరొకవైపు 4 మొత్తం 8 గదులుగా గీచి వానిలో ఒకపెంకి పిచ్చను మొదటి గదినుండి వేయుచు అలా మొత్తం ఎని గదులు విపోయేవరకు దాంట్లోకి ఒక కాలితో గెంటుకూ వెళ్ళి దానిని బయటికి తన్నుదురు. అలా అన్నిగదులు అయిన తర్వాత తలపైనుండి వెనుకకు చూడ

బండా వేసి అది ఏ అక్షరంలో పడితే ఆ అక్షరము X ఆకారములో గీయుదురు. అప్పుడు రెండవవారు ఆ అక్షరంలో కాలు పెట్టటానికి వీలుండదు. అలా ఎవరు ఎక్కువ అక్షరలు గెల్చితే వారా ఆటలో గెల్చినట్లు. ఇది ఈ యాట స్వరూపం ఆ తన్ను బిల్ల అంటే బహుశః ఇదే కావచ్చు నని నా యభిప్రాయము

బిల్లగోడు – ఇది సామాన్యంగా నేటికిని ఈవిధంగానే వ్యవహారంలో ఉంది ఈయాట ఆనాటి ఆటవికుల పిల్లలు ఆడే వారేమో

చెండ్లుగట్టిన బోది – ఇది చెండాట యని నేటికిని పిల్లలాడుకొనే ఆటయని చెప్పక చెప్ప చున్నది.

ఉప్పన బట్టె గూట – ఇదికూడ నేడు మన పల్లెటూళ్ళలో సామాన్యంగా రాత్రి వెన్నెల వేళలలో ఆడెటి ఆట.

ఈ విధంగా ధూర్జటి కాలంనాటి ఆటలు కొన్ని నేడు లేకపోయినను చాలవరకు నేటికీ జన సామాన్యంలో నున్నవే.

ఇక తిన్నని విలువిద్యను గురించి వర్ణించుచు అతి కుపయోగించిన విల్లును, గురించి చెప్పినాడు. కడవిల్లు, వెదురు విల్లు, సెలకువిల్లు మొదలైనవి తనవిల్లుగా వాడుకొనెడివా డని చెప్పినాడు. బహుశః రాయల కాలంలో చెంచులు, కోయలు ఈగకం విండ్లనే ధరించెడి వారేమో

తరువాత నాటి జరుపుగను కాళ్ళేని జాతర సందర్భమున వేట వినోదంబునకై వెళ్ళు సమయములో ఆ చెంచుమనిరిల అలంకరణలు ఈ విధంగా ఉన్నా రట. వారు పెవులిపురి దండలు ధరించినా రట, చెవిలో నెమలి పింఛపు ఈకలు పెట్టినా రట. వారు పెద్ద పెద్ద ఆకులనే చీరలుగా ధరించినారట, కొప్పులలో పరుకన పువ్వులు పెట్టినా రట, వారి ఎఱ్ఱనైన పాదములపైలాక్షారసమును పూసికొనినా రట, కళ్ళకు కాటుక, పునుగు, పచ్చికస్తూరి, జవ్వాదిఇలాంటిసుగంధద్రవ్యములు కలిపి దేహముపై బట్టించుకొని ఘుమఘుమా పరిమళముతో ఆయడవిలో తిరుగుచుండి రట. ఇంతకు ఈవాసన మా కవి గారి ముక్కుపుటముకు కెలా తగిలిందో మరి ఆనాడు చెంచు వనితలు ఈవిధంగా అలంకరించుకొని నగరమునకు వచ్చెడివారేమో. ఇవన్నియు ఈనాడు నాగరక స్త్రీలు వాడు చున్నప్పటికీ కృత్రిమమైనవి, అనారోగ్యకరమైనవి కాని వారానాడు నివసించుటయే అడవిలో కాబట్టి వారికి ప్రతి ఒక్కటి (Fresh Medicine) ప్రకృత్యౌషధంగాలభించినదే మరి రాయల కాలంలో ఆంగ్లేయ తినా లమ్మెడివా రట అలాంటిది ఈ ప్రకృతి ఔషధములు స్వచ్ఛంగా లభించు కెంపని? ఇలాంటిది స్వచ్ఛమైన శరీరాలకు పులుముకొనెడి వారు కాబట్టి ఆటవికులెంతో ఆరోగ్యముగా ఉంటారు

ఆ చెంచులు వారి కాళ్ళేని దేవపూజ చేయుటకై వేద్యములుగూడ చక్కనికయ్యాపాకములతో వర్ణించినాడు వారు నిక్కరి ధాన్యంతో పువ్వులాంటిఅన్నాన్ని వండినా రట. చమరీమృగముల పాలతో పాయసములు తయారు చేసినా రట కేసరి బియ్యముతో పిండి గట్టి వడములు చేసినా రట ఇంకా పిండితోనే కూరలు అనేకవిధాల జంతువుల మాంసములు వండినా రట ఈవంటకాలన్నియూ గంపలలో కావళ్ళలో పెట్టి, ఆదేవరకు బలి పెట్టుటకై గొప్పదైన అడవి పెద్ద మృగములను పట్టుకొని తప్పెట,డప్పు, చప్పుళ్ళతోను, ఎండిన సొరకాయల బుఱ్ఱలనే కిన్నరలుగా చేసికొని వాయించుచు, గుమ్మెటల చప్పుళ్ళతో, కొమ్ములతో ఊదుచు, కాళ్ళేని గుడికి వెళ్ళినారట ఇంత ఆర్భాటంగా నేడు చెంచులు చేస్తారోలేదో. కాని ధూర్జటిగారి కాలంలో చాలా అద్భుతంగా చేసిన ట్లుంది. మరి మన కవిగారు వారి వేషభాషలంటే రాచనగరుకు వచ్చినపుడు చూచినా రను కుందాం మరి ఈ సంప్రదాయాచారాలు ఎక్కడ కన్నాడోమరి. ఇదంతా అతని లోకజ్ఞతను చాటుతున్నది కవి ఒక కావ్యమును వ్రాయవలె నన్నచో అతనికి కేవలం కవితా చాతుర్యముంటే సరిపోదు. దానికి తోడు సరైన లౌకికవిషయము గూడ చక్కగా తెలిసి ఉండాలి.అతడు పండిత పామర జన సమాదరణీయుడు. అప్పుడే అతని కావ్యం లోక కళ్యాణం కొఱకు ఉపయోగ పడుతుంది. అట్టి ప్రతిభాపాటవములు గలవాడు కాబట్టే అట్టి వారి ఆచారవ్యవహారాలను చక్కగా రూపు కట్టించినాడు నేటికిని పల్లెలలో గూడ, గ్రామదేవరలను చేయునప్పుడు అలాంటి తతంగమంతా ఉంటుందను కొండి ఆవిధంగా వారు కాళ్ళేని కొలిచిన మునుపటి కోజా తిన్ననికి వేట సేర్పుటకు గాను సరియైన వారిని వెంటనుంచి ఆకోయకారా వేటనిమిత్తం డప్పు చాటించినా డట వారి వేట సామగ్రిని గూడ మనకవి గారు చక్కగా వర్ణించినారు. వారివేటవేషా లెలా ఉన్నాయంటే తెరచీరకట్టులు, గోగుచుట్టలు, దొడ్డివల, ఏటివల, బందేటివల, పందివల, ముకరవల, యెలికవల మొదలైన వలలను తీసుకొని పోయినా రట వేటకు ఇన్నిరకాలైన వలలు కావలయు నన్నమాట తెరచీరకట్టులంటే అడవి పచ్చగా ఉంటుంది కాబట్టి వేటగాడు గూడ ఆదేరంగు దుస్తులు ధరించాలి. తెరచీరలంటే అవియే కాబోలు.

బందేటివల అంటే అగిసన్నని దారములు కలిగియుంటుంది దీనిని బందేళ్ళు తిరుచువెళ్లే డొంకలలోకడ్తారు పందివల అంటే చాలా బలంగా ఉటుందేమో. ఇంకా రెండుమూడు రకాల వలలు గూడ ఉన్నాయట ఈనాడు పల్లెటూరివారు గూడ వేటకు పోతారు గాని ఇన్నిరకాల వలలు వాడటం అరుదు. బహుశః ఇవన్నీ కృష్ణరాయల కాలంలో రాజు వేటకు వెళ్ళునప్పుడు వాడేవారేమో. ఇంకా

ఇదియేగాక వారు పక్షులు, సివంగులు ఎద్దులు, ముంగిసలు, వీటిని గూడ వెంట పట్టుక పోయేవారట. వలలోపడక తప్పించుక పోయిన వానిని వేటకుక్కలు పడ్తాయి ఇదిగాక బోనులు, చిక్కములు చిగురు కండెలు, తీపుతాళ్ళు, ఉడిత్రాళ్ళు ఉలముళ్ళు మున్నగు త్రాళ్ళుగూడ తీసి కొని పోయినారట నేటికిని వేటకు పోయేవారివద్ద వీనిలో కొన్ని మనకు కన్పించును ఈవిధంగా వారు పులులు, లేళ్లు, కురంగములు, దుప్పులు, కార్నెక గండ్లు, భల్లూకాలు, చమరీమృగాలు, ఎనుపోతులు, కస్తూరి పిల్లలు, మున్నగు జంతువుల నన్నింటిని పట్టికొట్టాడినారట. ఈవిధంగా తిన్నడు క్రొవ్విన పందినొక దానిని తరుము కొనుచుపోయి అది కొంత దూరం పోయి మాయం కాగా అచ్చట ఒక శివలింగమును చూచి అది యీ యడవిలో ఒంటరిగా ఉందని భావించి అతడు తనయింటికి రమ్మని ఓ సామీ యిటువంటి కొండదరిలో నొంటింబులుల్ సింగముల్.

. ..

అలాగే"

కొండలఁ గోవలం దిరిగి క్రొవ్విన పందులను, లేళ్ళను వేటాడి వాటి మాంసం, నివ్వరి బియ్యంతో అన్నం, వండి పెడ్తానయ్యా! సామీ తినవయ్యా అని ఏడుస్తాడు. అలాగే అతడు తనయిం టికి వచ్చినచో నానావిధాలపండ్లును కోరి చెంచెతలు తెచ్చిస్తారని చెప్పాడు. వానిలో అడవిలో దొరుకు నానావిధములైన పండ్లును మనకు తెలుస్తాయి. నేరేడు పండ్లు, వెలయాటి పండ్లు, కొండమామిడి పండ్లు, దొండపండ్లు, పాలపండ్లు, నెమ్మి పండ్లు, బరివంక పండ్లు, చిటిముటి పండ్లు, కలికిపండ్లు, తొడివెందపండ్లు, తుమ్మికి పండ్లు, జానపండ్లు, గంగరేగుపండ్లు, వెలగపండ్లు, పుల్ల వెలగపండ్లు, మోవి పండ్లు, వంకెన్నపండ్లు, (వక్కెరపండ్లు) బలుసుపండ్లు, మొదలుగాగల పండ్లన్నియు నేను అడవిలో లభించునవే. ఈవిధముగా పూజించు భక్తుని భక్తి మూర్ఖభక్తి ఎలాగవుతుంది? స్వచ్ఛమైనదే.

ఈవిధంగా ధూర్జటి మహాకవి శివ ప్రబంధంలో భక్తిపరంగా ఆటవిక చెంచుల జీవితమును మనకు చక్కగా చిత్రీకరించినాడు. సహజంగా రచన చేయగల యితడు కృష్ణరాయలచే 'స్తుతమతియైన ఆంధ్రకవిధూర్జటి పల్కులకేలగల్గెనో యతులిత మాధురీమహిమ' అనిపించుకున్నాడు.

ఈవిధంగా ఇతడు తిన్నని కథలో తన లోకానుభవాన్ని చక్కగా చాటుకున్నాడు.

—...—

## శివానందలహరి

— శ్రీ వి ఆర్ పతి.

*సాగరముఁ జిలుక శక్తియు లేదయ్యా
  ప్రియభోజనమ్ము నే పెట్టగలుగ,
వేటాడు విద్యలో విజ్ఞానమే లేదు
  కోరువస్త్రములనే కూర్చగలుగ,
పాతాళమును చీల్చు ప్రజ్ఞయు లేదాయె
  ఒప్పుగా హారాల నొసగగలుగ,
ఆకాశ వీథికి నరుగంగ లేనయ్యా
  తిలపైన జాబిల్లి నిలుపగలుగ,
సలుపలే నైతి నే నుపచారములిక
ప్రేమనందన వనమందు విరిసినట్టి
మానసోత్పల ముకటి సమర్పణమ్ము
చేయగలవాడ గైకొమ్ము చిద్విలాస!

*విమల చరిత్రుఁడున్ ప్రబల
  విక్రమకీర్తిగడించు సాధు వృ
త్తకులు దళమ్ములందు తిరు
  గంగ సదా ప్రియమౌను నీకు, అ
యమునిరయమ్ము తన్నితివ
  టా! అరరే! అపు డెంత కందు, నీ
దు మృదు పదాలు నే సలుపు
  దున్ పరిచర్యలు చూపు మీశ్వరా॥

*నీరజబాంధవుం డొకడె
  నింగిని నేలను కారుచీకటిన్
దూరము చేసి తా వెలుగు
  తో కనిపించు కదయ్యా దేవ! నే
తీరుల భానుకోటి సమ
  తేజుడవే నిను గాంచ జాలనే!
ఔరా! హృదంతరాన గల
  అంధ తమస్సు తొలంగు టెప్పుడో?॥

*అలకతినమ్ము వాడి హృద
  యమ్మని ముందర నీవు నన్నికన్
పిలుచు పటంచు నే తలచి
  ప్రేమగ, కొండలలో వసించగా
అలవడినావు, లేకటు
  మహోత్సవమ్ములు యజ్ఞవేదికల్
వలదని నిల్తువేల గిరి
  వాసిగ, వాసిగ నన్నుఁ బ్రోవగన్'

*ఈవు సమస్తభూతముల
  కెల్లను రాజవు, రాజవైన నీ
కేవిధి సత్కళావిధవ
  మేదిని చూపి ముదమ్ము కూర్చనే!
కావున వింతయా పశుప
  గా, మనుచుండిన లోటులేదురా
దేవ! దయాకరా! పశుప
  తీ! శరణమ్ముక నాకు నీ వెగా?॥

*న్యాయమె నీకు 'వక్రగమ
  నమ్ము' 'పశుత్వ' మిటే 'కళంకము'ల్
వాయెడ లేవు, కాని కరు
  ణాకర! లోపములున్న వాటినే
లాగి యొసన కూర్చుకొంటివి ప్రి
  యమ్ముగ! మగ్గ మెరుంగ చేయనే
దీ! యొకసారి, నాకు కని
  పించు శివా! విహరించు మింతయేన్॥

***

# మాలతీమాధవము ఉత్పాద్యమా?

- శ్రీ పాలకోడేటి జగన్నాథరావు, ఎం. ఏ.

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తమ సంస్కృత వాఙ్మయ చరిత్ర ద్వితీయసంపుటములో భవభూతి మాలతీ మాధవమును గూర్చి

'ఇతఁడు రచించినవి మహావీరచరిత్ర, ఉత్తరరామచరిత్ర, మాలతీ మాధవము. ఇందు మొదటిదానిలోని యితివృత్తము ప్రఖ్యాతము రెండవదానిలోనిది మిశ్రమము. మూడవదానిలోనిది ఉత్పాద్యము' పుట. ౭౩౧.

అని వ్రాసిరి. వీరే యిందలి కథను గూర్చి వివరించుచు 'మూడవది కల్పితమైన మాలతీ మాధవుల కథ నాశ్రయించిన ప్రకరణము' అనిపేర్కొనిరి

భారత, భాగవత, రామాయణ, పురాణములే యితిహాసమను తలంపున కథాసరిత్సాగర మట్టిది కాదను తలంపున ఇతిహాసనిబంధనం ప్రఖ్యాతమ్ అనునియమానుసారము కథాసరిత్సాగరాంతర్గతమైన మాలతీమాధవములోని కథను శ్రీ శాస్త్రిగారు ఉత్పాద్యకథగా చెప్పియుండిరేమో యని శాభాతన లేకయీ కథ కథాసరిత్సాగరాంతర్గతమనువిషయము వారి దృక్పథమునకు వచ్చియుండలేదేమో యనికూడ ననుమానింపవలసియున్నది. ప్రతాపరుద్రీయాది గ్రంథవ్యాఖ్యానములలో కూడ మాలతీ మాధవకథ యుత్పాద్యమనియే వ్యాఖ్యానించిరి. కాని కథాసరిత్సాగరమునుకూడ భారతాదుల వంటి ప్రఖ్యాతగ్రంథముగా బరిగణించినచో తదంతర్గతమైన యీ మాలతీ మాధవప్రకరణేతివృత్తము శ్రీ శాస్త్రిగారు చెప్పినట్లు ఉత్పాద్యము కాక ప్రఖ్యాతమే కాఁగలదు. ప్రస్తుతము కథాసరిత్సాగరములోని మూలకథతో మాలతీమాధవ కథకుఁ గల సామ్యమును వివరించుటయే యీవ్యాసోద్దేశము

యాత్రార్థియై దేశాటనముచేయుచు నగవాహనదత్తుఁడను రాజు గంగాతీరమునకుఁబోయినపుడచట తనకుఁ గనఁబడిన యిరువురు బ్రాహ్మణయువకులను గాంచి వారి వృత్తాంతములను జెప్పుడని యడుగును. వారు తమ వృత్తాంతములను రాజుతోఁ జెప్పిన కథాసరిత్సాగరములోని పదమూడవలంబకము ప్రథమతరంగములోని కథయే యీ మాలతీ మాధవ ప్రకరణమునకు మూలము

మాలతీమాధవములో నాయకుఁడు మాధవుఁడు. అతని యాంతరంగిక మిత్రుఁడు మకరందుఁడు. వీరి వృత్తాంతములు క్రమముగా ప్రథమ, ద్వితీయ బ్రాహ్మణకుమారుల కథలతో సర్వాత్మనా పోలియుండును. కథాసరిత్సాగరములో ప్రథమ బ్రాహ్మణ కుమారుని వివాహము ప్రధానకథ. ఈప్రకరణములో కూడ మాధవుని వివాహకథయే ప్రధానకథ. ఉపకథగా ద్వితీయ బ్రాహ్మణయువకుని కథ కథాసరిత్సాగరములో కలదు. మాలతీమాధవములోను మకరందుని వివాహకథయే యుపకథ. కథాసరిత్సాగరములో బ్రాహ్మణద్వయముమిత్రులయినట్లుగా మాధవమకరందులు కూడ మిత్రులే

ఇఁక నాయికాపాత్రలను బరిశీలించినచో కథాసరిత్సాగరములోని ప్రథమ బ్రాహ్మణకుమారుని ప్రియురాలు మదిరావతియే మాలతీమాధవములోని నాయికయైన మాలతి. ద్వితీయ బ్రాహ్మణయువకుని ప్రియురాలే [పేరు చెప్పఁబడలేదు] మకరందుని ప్రియురాలగు మదయంతిక. కథాసరిత్సాగరములోని మదిరావతియు, ద్వితీయ బ్రాహ్మణ యువకుని ప్రియురాలును స్నేహితురాండ్రు ఇట్లే మాలతీ మాధవములోని పద్మావతీ నగరమంత్రి పుత్రిక యగు మాలతియు, ఆదే నగరమునకు మఱియొక మంత్రియగు నందనుని సహోదరి మదయంతికయు కూడ మిత్రురాండ్రే.

మాలతీమాధవములో మనకుఁగనబడు కామందకి, బుద్ధరక్షిత, అవంతిక, లవంగిక, సౌదామిని, మంకరందిక మున్నగు పాత్రలు కథాసరిత్సాగరములో లేని పాత్రలు. భవభూతి యీపాత్రల నావశ్యక ప్రయోజనమునకై క్రొత్తగాఁ బ్రవేశపెట్టెను. సందర్భానుసారముగా వానిని వివరింతును.

కథాసరిత్సాగరములోని బ్రాహ్మణమిత్రులకథ శృంగారాత్మకము. అందు నాయకుఁడైన వాఁడు విప్రుఁడు (ప్రథముఁడు) అతఁడు దేవరాతుఁడను నమాత్యుని కుమారుఁడు. కథ లౌకికమయినది. ఈలక్షణము లన్నియు ప్రకరణమున నుండవలసిన 'భవేత్ ప్రకరణే వృత్తం లౌకికం కవికల్పితమ్, శృంగారోఽఙ్గీ నాయకస్తు విప్రోఽమాత్యోఽథవా వణిక్" ఈ లక్షణములతో సరిపడుచుండుటచే భవభూతి కథాసరిత్సాగరములోని వృత్తాంతమును తన మాలతీ మాధవమునకు నితివృత్తముగా స్వీకరించెను

కథాసరిత్సాగరములోని ప్రథమ బ్రాహ్మణకుమార, మదిరావతులయొక్క ప్రణయము యాదృచ్ఛికము. మదిరావతి యొకనాఁడు తన యన్నతో కలిసి యాతఁడుచదువు విద్యాలయమునకుఁ బోవును. అచట వేదాధ్యయనము చేయుచున్న ప్రథమబ్రాహ్మణ కుమారుని రూపవిలాసములను జూచి మదిరావతి ముగ్ధురాలయి యాతనిపయి వలపు గొనును. ప్రథమ బ్రాహ్మణకుమారుడును నామెను జూచి

మరలుఁగొనును. ఈవిషయము తెలియని మదిరావతియన్న ప్రథమబ్రాహ్మణకుమారుని తనయింటికి తీసికొనివచ్చును. మదిరావతి తనప్రియుఁ డొంటరిగానున్న సమయమును జూచి తనదాది కూతురి ద్వారా మాలతీ పుష్పమాలను బంపుచు స్వయముగా పెంచిన మాలతీలతపూచిన ప్రథమ కుసుమములను ప్రియమైన వ్యక్తి కిచ్చుట న్యాయమని తలంచి పంపితి నని సందేశము నంపును. ఆ సందేశములో మదిరావతి ప్రణయస్నిగ్ధ హృదయమును గ్రహించిన బ్రాహ్మణకుమారుఁ డామాలను కంఠమునఁ దాల్చి నీ చెలికై ప్రాణములనైన త్యజింతు నని ప్రతిసందేశము నంపెను

ఇట్లు వీరి మధ్య నిర్వ్యాజముగా, యాదృచ్ఛికముగా సాగిన ప్రణయభావమును భవభూతి సంప్రదాయబద్ధముగా నొనరించిన యొక్క మార్పువలన కథాసరిత్సాగరమునకంటె కథావిస్తృతికి, కామందక్యాది పాత్రబాహుళ్యమునకు మాలతీమాధవమున నవకాశ మేర్పడినది

మాలతితండ్రి భూరివసువు, మాధవుని తండ్రి దేవరాతుఁడు, బాల్యమిత్రులు, సహాధ్యాయులు. విద్యాభ్యాసకాలమునందే తాము వియ్యమందు కొనవలయు నని వారిరువురు తమ మిత్రురాండ్రయిన కామందకీ సౌదామినుల యెదుట ప్రమాణములను చేసికొనిరి. తదనుగుణముగా దేవరాతుఁడు తనకుమారుఁడు మాధవుని న్యాయశాస్త్రాభ్యాసమునకై పద్మావతీనగరమున కంపును. అదే సమయములో నందనుఁడను మంత్రి మాలతిని తన కిచ్చి పెండ్లిచేయు మని రాజు ద్వారమున భూరివసువును నిర్బంధము చేయును. రాజుమాటను కాదనలేక తాత్కాలికముగ నంగీకరించిన భూరివసువు తన స్నేహితురాలగు కామందకికి మాలతీమాధవుల వివాహ మెట్లైనను జరపించు మని భారము నామె కప్పగించును.

కావుననే మాలతీమాధవుల ప్రేమ కథాసరిత్సాగరములోవలె యాదృచ్ఛికము, నిర్వ్యాజమును గాక సంప్రదాయబద్ధమైన దంటిని

భూరివసువుచే ప్రార్థితురాలయిన కామందకి మాలతీమాధవులమధ్య ప్రణయాంకురమును నాటి వివాహఫలపర్యంతము ను తనసహచారిణులతో సూత్రధారిణి యగును. కావుననే కామందకి వెంట అవంతికా, బుద్ధరక్షితా, లవంగికాదుల పాత్ర బాహుళ్యము మాలతీమాధవమున ప్రవేశించినది.

కామందకి పథకము ప్రకారము అవంతిక మాధవునకు మాలతిమేడప్రక్కనే నివాస మేర్పరచును. ఫలితముగా వారు పరస్పరము చూచుకొనుచు ప్రణయమనస్కు లగుదురు. ఒకనాఁడు మదనోద్యానమున మాధవుఁడు దేవాలయప్రాంగణమున పొగడచెట్టుక్రింద కూర్చుండి పొగడపూలను గ్రుచ్చుచుండును. అదే సమయమునకు కామందకి పథకముప్రకారము మాలతి సఖీజనముతో నచటకు వచ్చి పుష్పాపచయము గావించి కొంత వడికి భద్రగజము నెక్కి వెడలిపోవును. మాలతీ సందర్శనముచే మైపోగా శూన్యహృదయుఁడైన మాధవుఁడు వకుళమాలను తన మెడలో ధరించును. ఆ సమయమున మాలతి చెలికత్తె లవంగిక వచ్చి యావకుళమాల నడిగి తీసికొనిపోయి మాలతి కిచ్చును.

ఈ సందర్భమును కథాసరిత్సాగరములోని సన్నివేశమును గుర్తుపతేక మానను. లవంగిక మాధవునడిగి వకుళమాలను తీసికొనిపోయి మాలతి కిచ్చిన సన్నివేశముకంటె నొంటరిగాఁ జిక్కిన ప్రియునకు ప్రేమసందేశమును వ్యంగ్యముగాఁ జెప్పి మాలతీమాలనుపంపిన కథాసరిత్సాగర సన్నివేశమే ప్రణయస్నిగ్ధమై రమణీయముగా నున్న దని నాభావన. రెండు కథలయందును మాలావృత్తాంతము సమానమైనను తన వలపును దెలిపి మదిరావతి ప్రియునకుఁ బంపిన మాలతీమాలలోని ప్రణయభావవ్యంజకతను లవంగిక యడుగగా మాధవుఁ డామెకు వకుళమాల నిచ్చుట యామె మాలతి కిచ్చు వకుళమాలావృత్తాంతములో భవభూతి సాధించలేకపోయె నని నాయభిప్రాయము. అంతియేకాక భవభూతి యే చిత్రలేఖనమునో కాక స్త్రీజనోచితమైన వకుళమాలాకరణమును మాధవుని చే చేయించుటలో గల యౌచిత్యమేమియో కూడ నాకుఁ దోచుటలేదు. కథాసరిత్సాగరములో మాలతి వకుళమాలను మాధవున కిచ్చినట్లుగా గాని పోనిండు తద్భిన్నముగా మాధవుడే మాలతికి వకుళమాలను సాక్షాత్తుగా నిచ్చినట్లుగా గాని వర్ణించుట జరిగియుండినచో రమణీయముగా నుండెడిదేమో. కాని తద్భిన్నముగా లవంగిక వకుళమాలను మాధవునివడిగి తీసికొని మాలతి కిచ్చుట యనునది కథాసరిత్సాగరములోని నాయికానాయకులవలె మాలతీమాధవములోని నాయికానాయకులు స్వతంత్రులుకాక కామందకీపథకముల కనుగుణముగాఁ బ్రవర్తించు పరతంత్రులుగా చిత్రించిన దానికి తార్కాణముగా నున్నది.

ఇఁక ప్రస్తుతమునకు వచ్చెదము. మదిరావతి హృదయము నెఱుంగని తలిదండ్రులు పరయొకనితో పెండ్లి నిశ్చయింతురు. రాజుమాటను కాదనలేక భూరివసువు నందనమంత్రితో మాలతివివాహమును నిశ్చయించును. ఇట్లుభయ కథలయందును పరస్పరానురక్తులయిన నాయికానాయకుల ప్రణయభావమునకు విఘాత మేర్పడినది. తదనంతర కథనుండియే యుభయకథలకు చాల పోలిక లుండును.

ప్రథమబ్రాహ్మణ కుమారుఁడు నిస్సహాయుఁడై ప్రియురాలి యెడబాటును సహింపలేక యూరిచివరఁగల గుడి కెదురుగా నున్న వటవృక్షమునకు నురిపోసికొనుటకు సిద్ధపడును. కాని దైవము పంపినట్లుగ నచట కొక బ్రాహ్మణ యువకుఁడు వచ్చి వానిని రక్షించును

ఇట్లు రక్షించిన ద్వితీయ బ్రాహ్మణ యువకుఁడే మాలతీమాధవములోని మకరందుఁడు. ఈ బ్రాహ్మణకుమారులమధ్య యేర్పడిన వ్యాజమిత్రత్వమునే మాధవ మకరందుల మధ్య శాంతిరంగిక మిత్రత్వముగా భవభూతి పరిణమింపఁజేసెను.
ఈవిధముగా ద్వితీయబ్రాహ్మణయువకుఁడు ప్రథమబ్రాహ్మణమిత్రునకు ధైర్యమును చెప్పుచు తన కథను వివరించును.

యాత్రార్థినై 'విశాల' దేశమునుండి దేశాటనము చేయుచు శంఖ హ్రదమను గ్రామమునకు వచ్చితిని. అచట నొక సరోవరతీరమున పుష్పాపచయమును చేయు నొక యువతి రూపరేఖావిలాసములను జూచి వలపుగొంటిని ఆమెయు నన్ను జూచి వలపుగొనెను ఇంతలో నొక యేనుఁగు విజృంభించుచు నామె పైకి రాఁగా నేనామెను రక్షించితిని అంతలో నామె చెలికత్తెలు వచ్చి యా యువతిని గొనిపోయిరి నాటినుండి యామె కొఱకై విరాళితో నన్వేషించుచు నీ శోభావతీ పురమునకు వచ్చితిని

ఇట్లుడివిన ద్వితీయబ్రాహ్మణ యువకుని వృత్తాంతము మాలతీ మాధవములో మకరందుని పాత్రలో స్పష్టముగాఁ గనఁబడును

మాలతిని నందనునకిచ్చి పెండ్లిజరపుటకు నిశ్చయమైన వార్త విని మాధవుఁడు మన్మథోద్యాన వనమున విచారించుచుండును. మిత్రుని పరామర్శించుటకై మకరందుఁడా యుద్యానవనమునకు వచ్చుచుండఁగ నొక పులిబోనునుండి తప్పించుకొని ప్రజలను భీతావహులను జేయుచు మదయంతికమీఁదికికూడ వచ్చుచుండును. ఆ దృశ్యమును జూచి మకరందుఁడు వీరత్వముతో పులితోఁ బోరాడి దానిని జంపి మదయంతికను రక్షించును తాను పులి దెబ్బలకు మూర్ఛనొందును.

కథాసరిత్సాగరములో బ్రాహ్మణయువకుఁడు మదపుటేనుఁగు బారినుండి ప్రియురాలిని రక్షించగా మాలతీమాధవములో మకరందుఁడు పులిని చంపి మదయంతికను రక్షించును ఫలితముగా వారు పరస్పరానురక్తులగుట రెండుకథలయందును సమానాంశములే. కథాసరిత్సాగరములోని మదేభవిజృంభణమును శార్దూల విజృంభణముగా నీప్రకరణమున భవభూతి పరిణమింపఁజేయుటలోని యాంతర్యము మకరందుని సాహసికత నావిష్కరింపఁజేయుటకొఱకని నాభావము

కథాసరిత్సాగరములోని ద్వితీయ బ్రాహ్మణునికి, వాని ప్రియురాలికి మధ్య సంజనితమయిన నిర్హేతుకమైన ప్రణయభావ మీ మాలతీమాధవములో మదయంతికా మకరందుల మధ్య ప్రేమ భావము కామందకి - బుద్ధరక్షితల సహాయకములలో సహేతుకమై సంఘటితమైనదని ప్రకరణములోని 'అవలోకితే - అల మిదానీ మేతేన భగవతి! సోఽపి సహాని మాధవస్య బాలమిత్రం మకరందో నందనస్వసారం మదయంతికాం యది సముద్వహతి, తత్ ఖలు మాధవస్యాధికం ప్రియం భవతి.

కామంద - నియుక్తైవ మయా సా ప్రియసఖీ బుద్ధరక్షితా.

ఈవాక్యములు ఋజువుచేయుచున్నవి ఇట్లు కామందకిచే నియుక్తురాలయిన బుద్ధరక్షిత మదయంతికామకరందుల మధ్య ప్రణయము కలుగునట్లు సమయానుకూలముగా మాటలాడుచుండును పులి దెబ్బలకు మూర్ఛగొనియున్న మకరందుని పై కామందకి కమండలూదకమును జల్లగా వాఁడు తేరుకొనును అప్పుడు బుద్ధరక్షిత మదయంతికతో జనాంతికముగా సఖి! మదయంతికే! ఏష ఏవ సః అని పల్కును. అప్పుడు మదయంతిక సఖీ జాతి మేవ మయా యథా ఏష మాధవః అయ మపి స జన ఇతి. అనిపలుకును అప్పుడు బుద్ధరక్షిత అపి సత్యం వా ఇదీ అహమ్ అని ప్రశ్నింపగా న హ్యన్యాదృశేషు యుష్మాదృశ్యః పక్షపాతినో భవంతి అని వినయముగా బదులుపల్కును కావున నే మాలతీమాధవములోని మదయంతికామకరందుల ప్రణయము కథాసరిత్సాగరములోని ద్వితీయ బ్రాహ్మణ, తత్ప్రియుల నిర్హేతుకమయిన - నిర్వ్యాజికమయిన, ప్రేమవంటిది కాదంటిని కథాసరిత్సాగరములో ద్వితీయ బ్రాహ్మణ యువకుఁడు - వాని ప్రేయసుల మధ్య ప్రేమ పుట్టుటకు చిత్రింపఁబడిన మదేభవిజృంభణమును భవభూతి శార్దూలవిజృంభణముగా మార్చి మకరందుని సాహసికతను ప్రకటింపఁ జేయుట ప్రయోజనముగాఁ జేసినను ఆ సన్నివేశమును మాత్రము కామందకి, బుద్ధరక్షితల ప్రేక్షకులకు దూరముగానుంచి చిత్రించిన భవభూతి శార్దూలవిజృంభణ చిత్రణము నిజముగా రమణీయోర్జితమే ఈవిషయమును 'రమణీయోర్జితం హి మదయంతికా మకరందయో ర్దైవా ద్దృష్టం సందర్శనమ్' అను చతుర్థాంకములోని కామందకి మాటలే సాక్ష్యము.

ఇఁక ప్రస్తుతాంశమునకు వత్తము. బ్రాహ్మణ యువకు లిట్లు తమలో తాము సంభాషించుకొనుచుండఁగా మంగళవాద్యములతో సఖీ సమేతయైన మదిరావతి పెండ్లికూతురై గంగా తీరమునఁగల కామదేవుని గుడికి వచ్చుచుండును.

అప్పుడు ప్రథమ బ్రాహ్మణ కుమారుఁడు రెండవవానితో నేనీమెతోఁ గూడి యుండి పోలేకుంటి నని చెప్పును. ద్వితీయ బ్రాహ్మణ యువకుఁడు దేదో యాలోచించి హఠాత్తుగా మిత్రునితోకూడ కామదేవునిగుడిలోనికి ప్రవేశించి విగ్రహముల వెనుక దాగియుండును. మదిరావతి తనసఖీజనమును గుడి ముందుంచి యొంటరిగా లోనికిఁ బోయి, మఱు జన్మమునందైనను తనను ప్రియునితో కలుపు మని ప్రార్థించుచు ప్రాణత్యాగమునకు సిద్ధపడును. అపుడు ద్వితీయ బ్రాహ్మణ యువకుఁడు ప్రథమునితో 'నీ ప్రియురాలిని రక్షించుకొని రెండవ ద్వారముగుండ పారిపొ'మ్మని ప్రోత్సహించును. తాను మదిరావతి వేషముధరించి వచ్చి బయట నిలిచిన సఖీజనములో కలిసిపోవును.

కథాసరిత్సాగరములో నతిముఖ్యమైన యీ సన్నివేశమునే భవభూతియు తన మాలతీమాధవమున స్వీకరించెను. ఈసన్నివేశమే యుభయకథలకుఁ గల సామ్యమును నిరూపించు ముఖ్యాంశములలోని యతిముఖ్యాంశము.

మదిరావతివలె మాలతియు దేవాలయమునకు నమ్మవారిని పూజించుటకు సఖీసమేతముగా వచ్చును కామందక ప్రోత్సాహముతో ముందుగానే మాధవమకరందులు గుడిలో దాగియుందురు. మాలతి లవంగికతో గుడిలోనికిఁ బ్రవేశించును. మదిరావతివలె "నీ మెయిు యత్తస్య జీవిత ప్రదాయినః పరకీయత్వే నాప పరార్ధ మాత్మానం పరిత్యజ్య నివృత్తా భవిష్యామీతి ఏతస్మిన్ ప్రయోజనే ప్రియసఖి! మే అపరిపంథినీ భవతు (షష్ఠాఙ్కము) అని మరణోద్యుక్తురాలయి లవంగిక కాళ్ళమీదఁ బడును అప్పుడు లవంగిక మాధవునకు సైగచేసి పిలిచి తన

(తరువాయి 11 వ పేజీలో)

# రాజమండ్రి నామచర్చ - 2

- డా. శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు, ఎం.ఏ., పిహెచ్.డి.

మన యూరి ప్రాచీనతమ నామము రాజమహేంద్రపురమనియు, అది తరువాత 'రాజమహేంద్రుఁ'డిచ్చిన వరము(gift)గా 'రాజమహేంద్రవరము' గా మాఱినదనియు, అదే నేఁటివఱకును పండితుల వ్యవహారమున స్థిరపడినదనియు, అది చారిత్రకముగాఁ గూడ సరియైన రూపమనియు, 'రాజమహేంద్రి'యని తెలుఁగువాఁ డెవ్వఁడును,ఎప్పుడును వాడియుండలేదనియుఁ గ్రిందటివ్యాసమున సోపపత్తికముగా నిరూపించితిని.

ఈ వ్యాసమున ఆ నా, ప్రాయమును బలపఱచు మఱికొందఱు సుప్రసిద్ధ చారిత్రకులయు, విద్వత్కవీంద్రులయు ప్రయోగములను ఇచ్చుచున్నాను.

'విజ్ఞాన సర్వస్వము' అను బృహద్గ్రంథమును సంధానించిన సుప్రసిద్ధచరిత్రపరిశోధకులు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య డా. నేలటూరి వేంకటరమణయ్య, పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ అనువారి ప్రయోగమును జూడుఁడు.

'పోలవరమునకును, దిగువను న్నకొవ్వూరు రాజమహేంద్రవరములకును, మధ్య నది నావలు, ఆవిరితో నడుపఁబడు చిన్నపడవలు మొదలగునవి పోవుటకనుకూలముగ నున్నది.' - విజ్ఞాన సర్వస్వము - మూఁడవసంపుటము - పుట 6.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం గారలు రచించిన 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' అను గ్రంథములో,

'ఈతని (మొదటి అమ్మరాజ విష్ణువర్ధనుని) కాలముననే (922-927) 'రాజమహేంద్రవర' పురము నిర్మింపఁబడి చాళుక్యుల రాజధాని యయ్యెను' ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి-పుట 168.

**Benaras Hindu University History Asst Professor** అగు **Dr D C Ganguly, M A, Ph D** గారు రచించిన **'The Eastern Chalukyas'** అను గ్రంథములో **'Rajamahendra pattana'**అని కలదు. పేజీ162.

ఇఁక సుప్రసిద్ధ పండితులు శ్రీ ఆరుద్ర గారు తమ 'సమగ్ర ఆంధ్రసాహిత్యం' అను గ్రంథములో ఏమని ప్రయోగించినారో చూడుఁడు.

'మొదట వీళ్ళ (తూర్పుచాళుక్యుల) రాజధాని ఏలూరుకు సమీపాన ఉన్న వేంగిపురం. తరువాత బెజవాడ, ఆపిమ్మట రాజమహేంద్రవరం'. చాళుక్యయుగం, పుట 9).

'ఆ వేంగీదేశానికి నాయకరత్నమైన రాజమహేంద్రపురంలో దేవేంద్ర వైభవంతో పరమానందంతో అనవరత మహా మహీరాజ్యాన్ని రాజకులైక భూషణుడైన రాజరాజనరేంద్రుడు పరిపాలిస్తూ ఉండేవాడు' పుట 106.

శ్రీ ఆరుద్ర పై రెండు రూపములలో మొదటి దానిని ('రాజమహేంద్రవరం') పండిత ప్రయోగానుసారముగా వాడినది. రెండవది (రాజమహేంద్రపురం) నన్నయగారిని గూర్చి వ్రాయు సందర్భము గాన, నన్నయగారి ప్రయోగము తో సుముచితముగా వాడినట్టిది.

ఈరీతిగా నన్నయ మొదలుకొని, నేటి వఱకును తెలుగువారందఱును వాడిన రూపము 'రాజమహేంద్రవరము'

ఈ 'వరము' అనునది (gift) అను నర్థమునఁ జివరఁజేరి కాలక్రమమున, అర్థమును గోల్పోయి, గ్రామనామములకుఁ జివర suffix మాత్రముగాఁ జేరుచు వచ్చినది. అందుచేతనే వర మంతమందుఁ గల కొన్ని గ్రామనామముల కిదమిత్థముగా అర్థము చెప్పుటకు వీలుకాకున్నది.

'రాజమహేంద్రి' అని యే తెలుఁగు వాఁడును వాడియుండలేదు. అది East India Company వారి Records లోను, కొందఱు ఆంగ్లేయ గ్రంథకర్తల గ్రంథములలోను, Encyclopaedia గ్రంథములలోను మాత్ర మున్నది. కన్నడిగులు, ఉత్తరాది వారు వాడుచున్నట్టిది అట్టిది మనకు శిరోధార్య మెట్లగును?

రాజమహేంద్రివాదులు ఇటీవల ప్రచురితమైన Gazetteers అను గ్రంథమున 'రాజమహేంద్రి' యని యున్నది చూడుఁ డనుచున్నారు.

అందు ఒక్క 'రాజమహేంద్రి' యే యేల? మనయూరికున్న పేర్లన్నియు రాజమహేంద్రవరము, రాజమండ్రి మున్నగునవి యన్నియుఁ గలవు.

అందు 'రాజమహేంద్రి' యుండుటకుఁ గూడఁ గారణము, తత్కర్తయు ఆంగ్లేయ కర్తృకములైన గ్రంథములను జూచి దానిని రచించుటయే.

మనయూరికి 'రాజమహేంద్రి' యనునది యొక్కటే నామ ముండినచో, ఆ గ్రంథమున నాపేరొక్కటియే యుండవలసినది. అట్లు లేదు.

కావున అవియు (Gazetters) అస్మద్గ్రామ నామ విషయమున మనకు ప్రమాణము గాజాలవు.

పండితులకు 'రాజమహేంద్రి' యను శబ్ద మెఱుఁగున్నదని తెలియదనియు, 'రాజమహేంద్రవర'మని అనుస్యూతముగా పండితమండలి ప్రయోగించుచుండుటచే దానినే వాడుచున్నారనియు, ఈ 'రాజమహేంద్రి' నూతనంగాఁ దమచేఁ గనుఁగొనఁబడిన దనియు 'రాజమహేంద్రి' వాదుల భావముగా తోచుచున్నది. ఎవరో కొంతమంది కేవలాంధ్రపండితులు, ఆంగ్లేయభాషాకోవిదులు కానివారు 'రాజమహేంద్రి' శబ్దము నెఱుఁగరన్న కొంత అర్థముండునేమో కాని, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, డా. నేలటూరి వేంకటరమణయ్య ప్రభృతి మహామహులాంధ్రభాషానిష్ణాతులగుటయే కాక, ఆంగ్లభాషా విశారదులును, చరిత్ర పరిశోధన నిపుణులును గదా! వారికి 'రాజమహేంద్రి' శబ్దము తెలియదనుకొనుట మన వివేకవిశిష్టతను చాటును. వా రాశబ్దమును జూచియే, 'అది మనయూరి - పండితాంగీకృతమైన పేరు కాదు, విదేశీయోచ్చారణమున వికృతినందిన రూపము' అని యెంచియే దానిని పరిత్యజించి, తమ గ్రంథములలో 'రాజమహేంద్రవర' శబ్దమును వాడియుండిరనుట నిస్సంశయము.

రాజమండ్రి తీసివైచి, 'రాజమహేంద్రి'ని పెట్టుమనుట ఎంతమాత్రము హేతుబద్ధము కాజాలదు. కావున రాజమహేంద్రివాదులు రాజమండ్రి కంటె 'రాజమహేంద్రి' శబ్దము భ్రష్టరూపమని తెలిసికొని ఇప్పటికైనను తమ పట్టింపు సడలించుకొని తమ 'రాజమహేంద్రి' పునరుద్ధరణోద్యమము వ్యర్థమని గ్రహింపగలరని, ఆశించుచున్నాను.

---

(9 వ పేజీ తరువాయి)

స్థానమున నిలువుమనును. అప్పుడు మాలతి లవంగిక కాళ్లమీదనుండి లేచి చివరి సందేశముగా లవంగికతో 'ప్రియసఖి! సర్వదా స్మర్తవ్యాస్మి. ఏషా చ మాధవశ్రీ. స్వహస్తనిర్మాణమనోహరా వకుళమాలా మాలతీనిర్విశేషం ప్రియసఖ్యా ద్రష్టవ్యా. సర్వదా హృదయేన చ ధారణీయా.' అనిపలికి లవంగిక స్థానములో నున్న మాధవుని మెడలో మాల వేయును. వెంటనే లజ్జాభరయై ప్రక్కకు మాలతి తొలగిపోవును. ఆదేసమయమునకు కామందకి ప్రతీహారిద్వారా రాజు పంపినవస్త్రాభరణ మాల్యాదులను గ్రహించి గుడిలోనికి వచ్చును. దూరముగా నిలిచిన మాలతీమాధవులకు గాంధర్వవిధిని పెండ్లి చేసి గుడివెండవద్వారము గుండ పారిపోయి 'వత్సౌ! మాలతీమాధవౌ! ఇతో నిర్గత్య వృతిగహనేన అస్మద్విహారికాయాః పశ్చాదుద్యానవనే గమ్యతామ్. మునిహితం చ తత్రవైవాహికం ద్రవ్యజాతమవలోకితయా.'

అని యాజ్ఞాపించును. మకరందుని జూచి కామందకి,

వత్స! మకరంద! అత్రైవ మాలతీనైపథ్యేన అపవారితయ స్వ పరిణయ మాత్మానమ్. అని యాజ్ఞాపింపఁగా వాఁడట్లేచేసి బయటనున్న సఖీజనముతోఁ గలిసిపోవును.

ఈ సన్నివేశములో కథాసరిత్సాగర సన్నివేశముకంటె భేదములున్నను ప్రధానాంశమున మాలతీమాధవసమానముగా నున్న దనుట నిర్వివాదాంశము.

(సశేషము)

# వేమన్న పదం

— శ్రీ బి. మనోహర్ రావు, ఎం. ఏ

ధర్మార్థకామాలు మూడింటినీ త్రివర్గం అంటారు. వీటిలో దేనికి పెద్ద పీట వేయాలి? భారతీయ దార్శనికులు 'ధర్మం' ముఖ్యమంటారు ఆధునిక పాశ్చాత్య దార్శనికులలో 'కార్ల్ మార్క్స్' ఆర్థిక విధానాలను బట్టి సంఘంలోని ధార్మిక సూత్రాలు, నీతి, నియమాలు ఏర్పడుతాయని నిరూపించాడు మానసిక తత్త్వవేత్త 'సిగ్మండ్ ఫ్రాయిడ్' మానవ వ్యాపారాలన్నింటికీ కామమే ప్రధానకారణమంటాడు ధర్మం యుగధర్మాన్ని బట్టి, అర్థం సాంఘిక వ్యవస్థను బట్టి మారుతాయి గాని కామం మానవుని నైజగుణం. మనిషికి స్పందించే హృదయం ఎలా ఉండాలో ఆహృదయంలో కామం కూడా అలా వుండాలి ఇది వేమనగారు స్పష్టంగా గుర్తించారు.

కామిగాని వాడు కవిగాడు రవిగాడు
కామియైన వాడు కవియౌను రవియౌను
విశ్వదాభిరామ వినుర వేమ!

కామి అనే పదానికి కాముకుడు, మిక్కిలి మగటిమి గలవాడు, కోరికగలవాడు, స్త్రీకి వశుడగు మగడు అనే అర్థాలున్నాయి వేమనగారు ప్రయోగం చేసిన సంసారయోగం కనుక భార్యకు వశవర్తియైన భర్త అన్న అర్థం పొసగుతుంది వేమనగారు ప్రశంసించే కామం విచ్చలవిడి కామం కాదన్న సంగతి రూఢి అవుతుంది.

కవి అన్న పదానికి కవిత్వం గలవాడు, పండితుడు, అనే అర్థాలున్నాయి కామి కానివాడు పండితుడు కాడు. అంటే మూర్ఖుడన్నమాట. కామి కానివాడు రవివలెగా తాను వెలుగు లీనలేడు. కామియైన సంసారయోగికి జీవన పాండిత్యమబ్బుతుంది కర్మసాక్షియైన రవి లాగ లోక వ్యాపారాలను వీక్షించు నేర్పరి కాగలడు. తాను వెలుగుతూ ఇతరులపై కాంతులు చల్లగలడు కామికాని వాడు మోక్షమార్గం వైపు పయనించలేడు వేమనగారి కాలానికి పురుషార్థాలలో 'మోక్షం' కూడ చేరిందన్నమాట కామశాస్త్రం విరచించిన వాత్స్యాయనుని కాలంలో త్రివర్గమే ఉండేది ఆశాస్త్రంలో మొట్ట మొదటి సూత్రంగా 'ధర్మార్థ కామేభ్యో నమః' అని మూడింటికీ నమస్కారం చేశాడు వేమనగారి ఉద్దేశంలో మోక్షమంటే ఏమిటో తరువాత తెలుసుకుందాం ఆయన కామపురుషార్థాన్ని యింకా కొనియాడుతున్నాడు

కామియైనవాడు ఘనుడు కాడాయెనా?
కామియైన విష్ణుఘనుడు కాడె?
కామిగాక ఘనుడు గణపతి కాడాయె
విశ్వదాభిరామ వినుర వేమ!

త్రిమూర్తులలో ముఖ్యులైన హరిహరులు ఇద్దరూ భార్యకు వశవర్తులైన భర్తలే

'పడతి మోహ నొకడు' అన్న పద్యములో ఈ సంగతి చెప్పనే చెప్పారు శివకేశవులు కాముకులైనంత మాత్రాన వారి ఘనత ఏమీ తగ్గిపోలేదు. పూజలు ఆగిపోలేదు. గణపతి కామి కాడు అందుచేత, ఘనుడు కాలేకపోయాడు ఈ పద్యంలో వేమనగారు కామప్రశంస మాత్రమే కాదు ఆంధ్రదేశంలోని మతచరిత్రను కూడ సూచిస్తున్నారు మనదేశంలో శైవ, వైష్ణవ, మతాలే ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి ఈ రెండింటితో పాటు శాక్తము, గాణాపత్యము, సౌరము, కాపాలము అనే నాలుగు మతాలుకూడా ఉన్నాయి ఈ ఆరింటిని షణ్మతాలు అంటారు. గాణాపత్యం అనేది కొన్నాళ్లు మన తెలుగు దేశంలోనూ ఉండేది దీనిని అనుసరించే వారు వామాచారులు. తాంత్రికులు. ఉన్మత్త ఉచ్ఛిష్ట గణపతిని ఉపాసించువారు. వారిది కట్టుబాటులేని కాముక వ్యాపారమే కాని సంసారయోగికి కావలసిన 'కామం' కాదు. అందుకే ఆ మతాధిదేవత గణపతి ఘనుడు కాలేకపోయాడు. కామికి కట్టుకొన్న భార్య అవసరం.

కంటి మంటచేత కాముని గాల్చియు
పెంటి బాయలేడు పెద్దవేల్పు
పెంటి బాసినట్టి పెద్దలు కలరొకో
విశ్వదాభిరామ వినుర వేమ!

గరళకంఠుడు కామదహనం చేసినవాడే అంటే నీచకాముకత్వాన్ని జయించినవాడే. కాని ఆ పెద్ద దేవుడంతటివాడే భార్యతో ఎడబాటు భరించలేక ఒక ఆలిని నెత్తికెక్కించుకొన్నాడు. ఇంకో పతికి సగం మేను ఇచ్చాడు పెళ్ళాన్ని విడిచిపెట్టిన వాడికి పెద్దరికం ఉండదు. శివుడంతటి వాడికే ఇది చెల్లుతున్నప్పుడు సామాన్య జనానికి ఇది శిరోధార్యమే. బమ్మెర పోతరాజు కూడ స్త్రీల మాపుల బాణాలకు శివుడయినా గెలువలేడని భాగవతం అష్టమ స్కంధంలో ఇలా చెప్పాడు

కాముగెలువవచ్చు కాలారి కావచ్చు
మృత్యుజయము గలిగి మెరయవచ్చు
ఆకువారి చూపుటంపగెలువంగ
శకముగాదు త్రిపురహరునకైన.

మానవునిలో నైజగుణమైన కామాన్ని కాదన్నవాడు మనిషి కాడు. సహజ భావాలను అసహజ పద్ధతులతో కట్టివేద్దామనుకోవడం అవివేకం

కరకకాయలు గని కాసెలు బిగగట్టి
కాంత విడుచు వెల్ల కానిగుణము
వెంపలి తరుగట్ట వేవంశముండునా!
విశ్వదాభిరామ వినుర వేమ!

కరక్కాయను సంస్కృతములో హరీతకి అంటారు. 'దశమాతా హరీతకీ' అంటే కరక్కాయ పదిమంది తల్లులపెట్టు, ధన్వంతరి రచించిన సర్వౌషధి గుణ

కల్పకం ఆయుర్వేద నిఘంటువులో హరీతకీ మనుష్యాణాం మాతేవ హితకారిణీ అని ఉంది. 'ఉన్మీలినీ బుద్ధిబలేంద్రియాణాం సమ్మీలినీ' అని హరీతకీ లక్షణాలు చెప్పారు. ఇంద్రియనిగ్రహం ఇవ్వడంతో పాటు సర్వరోగాలను హరిస్తుంది. కనుక కరక్కాయను హరీతకీ అంటారు. కామం కూడా ఒక పెద్దజబ్బు అని, అది కరక్కాయలు తినడం వల్ల నయమవుతుం దని నమ్మకమో అపనమ్మకమో ఉంది కరక్కాయలు తింటూ కచ్చడాలలాగ కచ్చలు బిగించి కాంతలను విసర్జించడము కాని గుణ మంటున్నారు వేమనగారు. ఈ విధంగా కామాన్ని జయించడా మను కోవడము వెంపర చెట్టుకి ఏనుగును కట్టి పోరేద్దా మనుకోవడమే. 'పేని గడ్డి కట్ట పేనుగు నిలుచునా' అన్న పాఠాంతరం ఉండిగాని ఇది వేమన్న గారి మతానికి విరుద్ధం. 'గడ్డిపెంటి చెట్టి కట్టడా యేనుంగు' అనే ప్రయోగాల జంటను ఆయన చాలా ఇతరత్రా చేశారు. గడ్డిపోచలు పేని చేసిన వాటితో ఏనుగును కట్టవచ్చునని వారి భావం. కనుక ఈపద్యములో 'పేని గడ్డికట్ట' అన్న పాఠం కన్నా ఈ వెంపలి తరుసట్టు సాధుపాఠం అని భావించాలి కాంతను విడువకూడదు అన్నదే భావం. కాంత విడువ నియ్యదు అందుకే

కాంచనంబుపైన కాంతలపైనను
బ్రహ్మకైన బుట్టు రిమ్మ తెగులు
తోయజాక్షి విడుచు దొర యెవ్వడును లేడు
విశ్వదాభిరామ వినుర వేమ!

కాంతా కనకాలు రెండూ కామార్థ పురుషార్థాలకు కేంద్రాలు. ఈ రెండింటినీ చూస్తే బ్రహ్మకైనా రిమ్మ తెగులు పుడుతుందట. రిమ్మ అంటే తిక్క. 'ఉన్మాదం' పిచ్చి. నిజమే, వలచిన అతివ దూరమైతే పిచ్చెత్తించగలదు. అందుకే తోయజాక్షిని విడుచుదొర యెవ్వడూ లేడని వేమన గారు అంటున్నారు. వేరొకచోట 'కాంతమీద ఆశ, కనకంబుపై ఆశ లేని వాడు పుడమి లేడు' అని చెప్పారు. ఈపద్యాలన్నీ మగవాడి ఆధిక్యం ఉన్న సంఘంలో చెప్పినవి. మగవాడికి ఆడదానిపైన కూడా కామం సహజమే. ఆ సంగతి వేమనగారు ఇలా చెపుతున్నారు.

ఇంతి జూచెనేని నింతింత యనరాదు
కామవహ్ని లక్క కరగినట్లు
పట్టి మోహ మిట్లు రట్టులు జేయు రా
విశ్వదాభిరామ వినుర వేమ!

ఆడది కామంతో చూసిందంటే కాని పర్యవసానం తేలికగా చెప్పలేం ఆమె మోహించినవాడు లక్కవలె కరిగి పోయినట్లు ఆమె చూపుల జ్వాలకి కరగిపోవలసిందే. వాళ్ళిద్దరికీ వరసా వావీ కుదిరితే సరేసరి లేకపోతే ఆ పట్టి మోహంవల్ల నిందల పాలు కాక తప్పదు. రట్టు అంటే నింద. అపకీర్తి, ఉపద్రవం, అపజ, గోల, అల్లరి చౌరవ, సాహసం అనే అర్థాలున్నాయి. మోహం ప్రబలమైతే అది తీర్చుకోవడానికి సజావైన మార్గాలు లేకపోతే పైన చెప్పిన అర్థాలన్నింటిలో అనర్థం వాటిల్లక మానదు. అయినా అదను చూసుకొని ఆశలు తీర్చుకొనేవారు లేకపోలేదు.

అదను నెరిగిన మగువ అను వెర్గు చను వెర్గు
ముదము తోడ మగని మోహ మెరుగు
విభుని శ్రేష్ఠగుణము వేశ్య తా నెరుగునా
విశ్వదాభిరామ వినుర వేమ!

సమయం, సందర్భం తెలిసిన స్త్రీకే సాధ్యాసాధ్యాలు, సరసతలు, చనువు తెలుస్తాయి అటువంటి ముదితకే మగని మోహం తెలుస్తుంది ఆమె అది తీరుస్తుంది మగని వలపులోని మంచి గుణాలు మగవాలికి తెలిసినట్లు వేశ్యాలికి తెలుస్తాయా? ఆమె దృష్టి ఎప్పుడూ డబ్బు మీదనే ఉంటుంది. ఆమె జీవితంలో అర్థకామాలు రెండూ విడివిడిగా ఉండవు. కామపురుషార్థాన్నే అర్థసంపాదనకు వినియోగించుకోవలసిన పరిస్థితిని సంఘం సృష్టించింది. మానవునికి కాంతా కనకాలపైన ఆశవున్నా వారకాంతకు కనకంబుపైనే మక్కువ. అది ఆమె జీవనోపాధి. పశువులైనను సరే ముందు మేతను గురించి జాగ్రత్త పడతాయి.

కడుపునిండ తవుడు గంపలో బెట్టక
చన్ను ముట్టనీదు తన్ను బర్రె
వారకాంత విటుని వలచునా యూరక
విశ్వదాభిరామ వినుర వేమ!

పశుప్రవృత్తి అయినా కడుపుకూటి కోసమే. కోటివిద్యలూ కూటికొరకే అన్నది అక్షరాలా నిజమైన సామెత. మనిషి బతకాలి. బతకడానికి తిండికావాలి. ఆగమ సమాజంలో అందరికీ ఆహారసేకరణలో సమాన అవకాశాలే ఉండేవి. వ్యవస్థలు మారి మారి కొన్ని వర్గాలవారికి కూర్చున్న చోటనే కూడు. కొన్ని వర్గాలవారికి పాటుపడినను పట్టెడన్నం దొరకదు. ఇట్టి అసమానతల వ్యవస్థ ఏర్పడింది. ఆదిమసమాజం నుండి మానవుడు సాధుజంతువులను మచ్చిక చేసుకొని సౌకర్యవంతమైన జీవనం గడుపుతున్నాడు. పాడికోసం కొన్ని జంతువుల పోషణ, సాపాటుకోసం, కొన్ని ప్రాణుల పెంపకం సంఘంలో అవసరమైంది. పాడిపశువులు ఎలాంటివో పశుప్రవృత్తులు అలాంటివారే ఇద్దరికీ భుక్తి ముఖ్యం. అది గడించినంతవరకే పెంచుతున్నవాడికైనా ఆటలు సాగుతాయి. అయినా బజారులో వలపు కొనుక్కోడం అవివేకం

వలపు కలిగె నేని వనజాక్షి, యధరంబు
పంచదారకుప్ప పాలఉప్ప
చూతఫలరసంబు జుంటిసమానంబు
విశ్వదాభిరామ వినుర వేమ!

మరులుగొన్న మగువ పెదవి అనగానే హాయిగా ఉంటుంది. అధరపానాన్ని ఆ పాత మధురమైన వాటితోనే వేమన గారు ఉపమించారు. కొన్నిపదార్థాలను కొరికి నమిలితేగాని వాటి రుచి ఆస్వాదించలేము కొన్ని నోటిలో వేసికోగానే వాటి రుచి ఆనంద మిస్తుంది. పంచదార, పాలు, పళ్ళరసం,

(తరువాయి 16వ పేజీలో)

# జానపద గేయసౌందర్యము

— 'భారతీప్రియ' శ్రీ వెలుదండ సత్యనారాయణ, ఎం. ఏ.

జానపద కవిత్వమునకు గేయత్వము పూవునకు తావివంటిది.

జానపదుల గేయ మొక రకముగా స్వయంభువు అనగా అది తనంత తానే పుట్టునని లేక తన పుట్టుకకు కారణము తానే అగుననగనే 'A folk Song composes itself' అన్న అభియుక్తోక్తి కలదు.

హృదయమున పొంగులువారు భావమునకు ధ్వన్యాత్మక మగు రూపము 'కూనిరాగము' దానిలోనుంచి గాని, దాని తర్వాత గాని లయము జనింపగా లేక లయ సంగీతాత్మకమైన రాగయుక్తమైన ఆ కూనిరాగమే పదాలతో నిండి గేయముగా పరిణమిస్తుంది అనగా భావయుక్త శబ్దరహితమైన ఆ కూనిరాగమునందే పదాలు, శబ్దాలు ఇమిడి క్రమేణా ఒక సుందర భావమును ప్రతిబింబించు గేయముగా భాసిల్లునని చెప్పవచ్చును.

గేయముయొక్క పుట్టుక ఈవిధముగా జరుగుచున్నందున గేయమునకు లయ ప్రాణమగుచున్నది. జానపదులు లయానుగుణముగా చెప్పుటవలననే ఆతని భావము గేయత్వమును సంతరించుకొనుచున్నది.

జానపద గేయోత్పత్తి చాలమటుకు నృత్యముతో లేక నృత్యమున కనుగుణముగా జరుగును. కవిత్వమునకు గాని కావ్య నియమములకు గాని లోబడి జరగదు. అందువలన జానపద గేయములందు కావ్యలక్షణములను వెదకుట నిరుపయోగమైన పని. నృత్యమున కనుగుణముగా గేయోత్పత్తి జరుగుటవలన నృత్యమున కున్న తాళలయ లొక్కటిగా గేయమునకు సంక్రమించును. అందువలన గేయ మొక నృత్యమువలె కదలాడుచు సాగుచు సులువుగ ఉచ్చారణముగా నీ గేయములందు అచ్చమైన అందమును వెదకుట యుపయోగకారి. రసానందము గ్రోలుటయే వీటికి ప్రయోజనము. కనుకనే శ్రీ రామరాజుగారు తమ 'జానపద గేయసాహిత్య' మందు 'తాళలయలతో గూడి ఈ గేయాలు శిష్టసాహిత్యమునకే కాక సంగీతమునకు గూడ ఆదిరూపము లని భావింపవచ్చును' అన్న చక్కని అభిప్రాయమును వెలిబుచ్చారు.

శిష్టసాహిత్యమున మార్గకవిత్వపద్ధతి అత్యధిక స్థానము నాక్రమించుచున్నది. ఈ విధమైన కవిత్వపద్ధతి సంస్కృతము నుండి తెలుగునకు సంక్రమించినట్టిది. ఒకరకముగా నీ పద్ధతి సంస్కృతమునకు నచ్చినంతగా అతికినంతగా తెలుగునకు అతకలేదనే చెప్పవలెను. శిష్టసాహిత్యము కొంత తెలుగుదనాన్ని కోల్పోవుచున్నదీ సందర్భమునందే అనికూడా ఒప్పుకొనవలసి వచ్చును. అదే సమయమున శిష్టసాహిత్యాంగీకృతమైనను దేశిచ్ఛందము తోడి రచన తెలుగునకు పూర్తిగా సహజము అనుకూలమై చక్కగా కుదిరిన పద్ధతి యగుటచే పామరుల కతికాదరణీయమగుచునే యున్నది. దేశిచ్ఛందమున వెలసి జానపదులలో నల్లుకొని పోయిన వేమన పద్యాలే ఇందులకు ఉదాహరణములుగా చెప్పవచ్చును. ఈ దేశి కవితల నుండియే జానపద గేయములును ఉద్భవిల్లినవని కొందరు అభిజ్ఞుల యభిప్రాయము!

జానపద రచనకు ప్రధానాలంకారము గేయత్వమే. శిష్ట సాహిత్యరచనకు వలె వేరే అలంకారములకై వెదుకవలసిన పని లేదు. నాగస్వరమువలన సర్పమువలె ఈ గేయత్వము వలననే పామరుడు సులభముగా నాకృష్టుడగును. శిష్టరచనమున గేయత్వము తక్కువ కాబట్టే కనుకనే పామరు డాకృష్టుడగుట జరుగదు. ఒకవేళ శిష్టసాహిత్యమునందలి పద్యములైనను చక్కగా రాగయుక్తముగా పాడినచో నా పామరుడే మరల నాకర్షింపబడును. పామరుల నాకర్షించునది ప్రధానముగా గేయత్వమే నని దీనివలన తెలియుచున్నది.

అట్లు శిష్టసాహిత్యమందలి పద్యముల వలన నాకర్షితుడైన పామరుడు మరల కొన్నికొన్నిచోట్ల అందలి పాండిత్య ప్రకర్ష యర్థముగాక కొంత వికర్షింపబడుటయు జరుగుచుండును. కాని జానపద గేయములందు పాండిత్యప్రకర్ష యన్నదే లేకపోవుట వలన ఆకర్షింపబడిన పామరు డటులే యుండిపోవును.

పాండిత్య ప్రకర్షకు శిష్ట సాహిత్యముతో నున్నంత సన్నిహిత సంబంధము పామర మనస్తత్వముతో లేదు. కనుక నీ రచన పామరునికి దూరముగానే యుండిపోవలసి వచ్చుచున్నది. కనుక ఈ పాండిత్యప్రకర్ష ఎంత తగ్గితే కవిత అంతగా పామరునకు సన్నిహితమగు నని తెలియుచున్నది. అందువలననే వేమన పద్యాలు జానపదుల హృదయములలో స్థిరనివాస మేర్పరచుకొనగలిగినవి.

సూక్ష్మముగా పరికించిన పాండిత్య ప్రకర్ష బుద్ధికి పనులు పెట్టుటకే యుద్దేశింపబడినట్లు తోచును. జానపద గేయము అందరికి లేకపోవుటచే సూటిగా హృదయమునకు చేరగలిగి హాయిని గూర్చునదియై యున్నది. 'ఆ' పెరిగిన బ్రాహ్మణునకు జందెమేల? అట్లనగా ప్రయోజన మెరిగిన పిదప నింక దానికి లిఖిత రూప మున్న నేమి? లేకున్న నేమి?

జానపద రచనకు గేయత్వ మలంకార మయినట్లే ఆ గేయమునకు Refrain లేక పల్లవివంటి ఊతపదము (వలలో, ఉయ్యాలో మొ॥ నవి) అలంకారముగా

భావిల్లును అయితే ఈ Refrain పల్లవి కానక్కరలేదు. జానపదమున శ్రోతల నాకర్షించుటలో వీటికి కూడా అగ్రతాంబూలమే యీయసంగి వచ్చును. శిష్టసాహిత్యము నందును 'మకుట' యుక్తములైన శతకములలోని పద్యములు విన్నప్పుడు శ్రోత మొట్టమొదటగా నాకర్షింపబడుట ఈ 'మకుటము'వలననే. ఈ మకుటమనునది కొంత దీర్ఘముగా నున్న శ్రోత అంతగా నాకృష్టుడగుటకు గమనించవచ్చు. ఉదాహరణకు 'భాస్కరా' అన్న మకుటము చిన్నదగుటచేత తప్పక నాకర్షించును. కనుకనే ఆ పద్యములు కంఠస్థములుగా నున్నవారు తప్పక 'దాశరథీ! కరుణాపయోనిధీ!' అన్న మకుటమంతకన్న పెద్దదిగా నుండుటచేత ఆ పద్యములు కంఠస్థములుగా నున్నవారి సంఖ్య కొంత హెచ్చు వినను ఇది చివరిపాదమున సగముమాత్రమే ఆక్రమించిన మకుటము. పైగా నీ పద్యములు దేశిచ్ఛందమునకు సంబంధించినవి కావు. అట్లుగాక దేశిచ్ఛందమున నుండు పద్యములలో చివరి పాదమును పూర్తిగా నాక్రమించిన 'విశ్వదాభి రామ! వినురవేమ!' అను మకుటము గల్గిన వేమన పద్యములు శ్రోతలను పైరెండిటికన్న విశేషముగా నాకర్షింపగలుగును. ఇందుకు కారణములుగా కన్పట్టునవి మూడు. 1) మకుటము పెద్దదిగానుండుట తద్వారా అనేకుల నాకట్టుకొనుట. 2) మకుటము ఒక చిన్న పదముగా గాక పెంపొంది నాలుగవ పాదముగా రూపొందుట లేక ఆ పాదమును పూర్తిగా నాక్రమించుట. దానివలన ప్రతి పద్యమున నాలుగవ పద్యమును మరల మరల కంఠస్థ మొనరింప నవసరము లేకపోవుట జరుగును. తొలుత నొకసారి కోటికి పట్టిపోయిన చాలును! ప్రతి పద్యముచివర అదే అప్రయత్నముగా చేరి వచ్చుచుండును. పై మూడుపాదములను కంఠస్థము చేసిన చాలును 3) పద్యము దేశిచ్ఛందమున నడచుట. దేశి జానపదగులకు సన్నిహితముగదా! వేమన పద్యము లనేకులకు కంఠస్థములుగా నుండుటయే వాటికున్న ఆకర్షణశక్తిని చాటుచున్నవి.

ఈ 'మకుటము' ప్రస్తుత చర్చనీయమైన Refain వంటిదే. ఇది ఆవృత్తి నందినప్పుడెల్లా చిత్తమునకు హత్తుకొనును. దాని కలనే గేయము సాగగలుగును

ఇక పల్లవి పూర్తిగా ఒకటి లేక రెండు పాదముల నాక్రమించు 'Refrain యే సంగీత కళ మూలాంశము కొలది పల్లవిగా రూపొంది యుండును' అని శ్రీ రామరాజు గారి యభిప్రాయము వారింకన-

'Refra n పల్లవి కానక్కరలేదు. కాని పల్లవిమాత్రము Refrain వంటిదే' అంటారు. దీనివలన Refrain యొక్క పరిణత రూపమే పల్లవి యను కొనవచ్చును. Refrain వున్న గేయము పల్లవి నపేక్షింపదు. పల్లవికలిగిన గేయమునకు Refrain తో అవసరము లేదని గాని, వున్నను చాల తక్కువే అని గాని, చెప్పవచ్చును. కాని పల్లవియున్నను Refrain కొన్ని గేయములందగుపించును. పల్లవిని కేంద్రముగాచేసికొని గేయములు జానపదమునవున్న ఒక మంచి లక్షణముగా పేర్కొనవచ్చును. గేయము మొదట పల్లవినుండి మొదలై ఒయ్యారముగా నొక్కొక్క చరణము మీదుగా సాగిపోవుచు మరలవచ్చి పల్లవిని స్పృశించుచు మరల సాగుచు గేయమునకొక వింత అందమును సంతరించిపెట్టును. శిష్ట రచనమున నిటువంటి కేంద్ర మేదియు కానరాదు. శతకాదులలో మాత్రము మకుటము నిటువంటి కేంద్రముగా పేర్కొనవచ్చును.

ఈరీతిగా జానపద గేయములందు సహజ సౌందర్యము విలసిల్లుట గమనించవచ్చును.

*_*

# ఈ పక్షంలో

## సమాలోచన వార్షికోత్సవ సభ

రాజమండ్రి యంగ్ మెన్సు వైశ్యా అసోసియేషన్ & వుమెన్స్ అసోసియేషను హాలులో రాజమండ్రి హాబీపారు క్లబ్బువారి యాజమాన్యమున క్లబ్బుఅధ్యక్షులు శ్రీ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి గారి సంపాదకత్వమున ప్రచురింపబడుచున్న 'సమాలోచన' జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక వార్షికోత్సవసభ జరిగినది. ఇన్‌కంటాక్సు ఆఫీసరు శ్రీ పానుగంటి శ్రీరామమూర్తిగారు అధ్యక్షత వహించిరి

"భాషాపటుత్వం భాషావిస్తృతలతో వింటేనే సాహిత్యం అమృతవంటిది. సమాలోచన పత్రిక ఇట్టి విశిష్టతతో చక్కని విషయాలతో వెలువడుచున్నది. ఆర్థికదృష్ట్యా లాభదాయకం కాని యీ పత్రికను పాఠకులకు పూర్వ నవీన కవి పండితుల రచనల నందించాలని పండితులకు పామరులకు అందరకు ఉపయోగ పడేలాగున సాహిత్యాభిమానంతో శ్రీ బులుసు సీతారామశాస్త్రి గారు నిర్వహించుచున్నారు విశ్వశ్రేయస్సు లక్ష్యంతో సాహిత్యం 'సత్యం శివం సుందరం' అను ప్రతిబింబింపజేయాలనే ధ్యేయంతో పురోగమిస్తూ అయిదవ సంవత్సరంలో అడుగుపెట్టిన యీ పత్రిక కలకాలం వర్ధిల్లాలి" అని అధ్యక్షులు తమ ఆకాంక్షను ప్రకటించినారు

మునిసిపలు కౌన్సిలరు డాక్టరు శ్రీ చిలకమర్రి కృష్ణమాచారి సభా ప్రారంభం గావించినారు 'సమాలోచన'పత్రిక చదివి రసాస్వాదం చేసే మనమందరం చేరగం ఆనందదాయకం. వ్యాసాలు విమర్శలు కవితలు మున్నగు విషయాలతో ముందుతరాలవారికి సాహిత్యపు విలువ

అను గ్రంథాల ఔన్నత్యమును వివరించే మార్గదర్శినియైన పత్రిక యిది. చదువరులకు సాహిత్యాభిరుచి కలిగించడం పరమ లక్ష్యంగాగల ఈపత్రిక తప్పులు లేకుండా ప్రచురింపబడడం విశేషం' అని శ్రీ కృష్ణమాచారి వక్కాణించిరి

డాక్టరు శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు, ఎం ఎ, పిహెచ్ డి గారు 'సమాలోచన' వార్షిక ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తూ 'ఇందలి వ్యాసాలు రీసెర్చి స్కాలర్సుకు ఉపయోగించే విధంగా ఉండడం విశేషం పత్రికాధిపతి స్వయంగా పండితులు కావడం ఈపత్రిక విశిష్టతకు గల ప్రధానకారణం' అని తెలిపిరి

రసజ్ఞశేఖరులు సాహిత్యశిరోమణులూ అయిన శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యం గారు ప్రసంగిస్తూ తత్కాలిక ప్రయోజనాలకుగాక శాశ్వత ప్రయోజనాలకు కట్టుబడి 'సమాలోచన' ప్రాచీనకావ్యశ్రీ అను ఆధునికులకు విపులీకరించడమూ సాహిత్యాభిలాష కలిగించడమే కాక కవిత్వంచేసే వారిప్రతిభను వెలుగులోనికి తీసుకురావడం సంగీతం మున్నగు లలితకళలను ప్రోత్సహించడం మూలముగా ప్రాచీనాధునిక సాహిత్యసంస్కృతులకు దర్పణమై నిలచుచున్నది అని వివరించి పత్రికాధిపతికి తమ శుభాకాంక్షలు తెలియచేస్తున్నారు

పత్రికాధిపతి శ్రీ బులుసు సీతారామశాస్త్రి గారు ప్రస్తుతం దేశంలో కానవస్తున్న వివిధరంగములలోని అత్యుత్తములను అతి వేగంపలను అతిరూపములను ఖండిస్తూ ... సర్వమున్నగ్రహించుట సమాలోచన ప్రధాన లక్ష్యమని తెలిపి లాభాపేక్షయుల పసక్తితో నిమిత్తంలేకుండ సాహిత్యాభిమానంతో నిష్పక్షపాత విమర్శనదృష్టితో పత్రిక నడపబడుచున్న విధమును వివరించినారు

అనేక రంగములలో ప్రముఖులైన శ్రీపసాదేవ సూర్యప్రకాశరావు, శ్రీ చేబియ్యం వెంకట్రామయ్య, శ్రీ డాక్టరు పోడూరి రామమూర్తి, శ్రీ ఆర్. వి. పెండ్యాల, శ్రీసన్నిధానం నరసింహశర్మ పత్రికయందలి విషయ వైవిధ్యమును వివరించి ప్రశంసించి శుభాకాంక్షలు తెలిపిరి

అనంతరం శ్రీ ఇంద్రగంటి అచ్చన్న శాస్త్రి, బి ఎ గారి ఏకపాత్రాభినయం రమణీయంగా జరిగినది.

క్లబ్బు సహాయ కార్యదర్శి శ్రీ వి నరసింహాచారి, ఎం ఎ, ఎం ఇడి, బి ఎల్. గారు తొలుత అతిథులకు వస్త్రంతో స్వాగతముపలికి చివర వందనసమర్పణము గావించిరి

(వి. యస. యస్)

0

## గ్రంథావిష్కరణ సత్కార సభలు

ఇటీవల దువ్వూరి రామకృష్ణరావు ట్రస్టు పక్షమున శ్రీ రాచకొండ వెంకటేశ్వర్లు గారు రచించిన 'ఉపనయన సంస్కారము' గుంటూరు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రచించిన 'గంగార్క శతకము' అను గ్రంథములు 11-11-81 తేదీని గౌతమీ గ్రంథాలయమున జరిగిన సభలో ఆవిష్కరింపబడినవి. సభకు సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ కేసిల్ల సూర్యప్రకాశశాస్త్రిగారు అధ్యక్షత వహించిరి

ప్రసిద్ధకవి శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు ఈ రెండు గ్రంథములను ఆవిష్కరించి సోదాహరణముగా గ్రంథరచయితల ప్రజ్ఞావిశేషములను నుగ్గడించి తమ అభినందనములను తెలిపిరి ఈ సందర్భమున మువ్వురు కుమారాధ్యాపకులకు రు 116 లు చొప్పునను అథర్వవేద వ్యాఖ్యాతలైన శ్రీ ఎం విశ్వేశ్వరశాస్త్రిగారికి రు 400 లు విలువగల గ్రంథములు నిచ్చి సత్కరించిరి.

ట్రస్టీ శ్రీ పోతుకూచి సూర్యనారాయణమూర్తి స్వాగతంపలుకుతూ సర్వ ఆశయాదర్శాలను కార్యకలాపములను వివరించారు

సర్వశ్రీ కొల్లిఅనంతపద్మనాభశాస్త్రి, శ్రీ గుంటూరి భానుమూర్తిశాస్త్రి, కాకినాడ అడ్వకేటు శ్రీ డి. రామచంద్రరావు, ఆంధ్రా యూనివర్సిటీ రిటైర్డు సంస్కృత ఆచార్యులు శ్రీ డా. వేలూరి సుబ్బారావు మున్నగువారు ఇందు పాల్గొన్నారు

లైబ్రేరియన్ పండిట్ శ్రీ చిలుకూరి విశ్వనాథశాస్త్రి వందన సమర్పణతో సభ ముగిసింది.

* * *

( 18 వ పేజీ తరువాయి )

తేనె అటువంటి పదార్థాలు. ప్రియురాలి పెదవి ప్రేమ ఉన్నప్పుడు ఈ మధుర పదార్థాలలాగ తియ్యగా ఉంటుందట. ఈపద్యంలో వేమనగారు వాడిన 'పాలు ఉప్పు' అనే ప్రయోగానికి 'పాలకోవ' అనే అర్థము స్ఫురిస్తుంది.

ఈ విధంగా వేమనగారు ఆనాటి మత సాంఘిక దురాచారాలన్నింటిని చూచి చెప్పిన మహామనీషి. ఈతడు వాస్తవముగా ఒక గొప్పకవి అని చెప్ప, కోవచ్చును ఇతని పద్యములు ఒకవరుస క్రమములో లేనందున అతనిమీద పరిశోధన చేసినవారు చాల తక్కువ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ వేమనను గూర్చి చాలా పరిశోధన చేశారు

ఆంగ్లేయుడు బ్రౌను దొరగారుకూడా వేమన పద్యాలను రెండుచోట్ల పైగా ఇంగ్లీషులోనికి అనువాదము చేశారు.

* * *

# హంపారు క్లబ్బు, రాజమండ్రి.

( స్థాపితం 1935 )

## ఆహ్వానము

24-11-81 తేదీన మంగళవారం సాయంకాలం గం 5-00 లకు శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటులో హంపారు క్లబ్బు యాజమాన్యము 'రాజమండ్రి' పేరుమార్పును గురించి చర్చించే నిమిత్తం సభ జరుగును (18-10-81 తేదీ సభకు Continution గా)

అభిరుచివున్న ఎవ్వరైనా తమ తమ అభిప్రాయాలను సహేతుకంగా వివరించవలసినదిగా ఆహ్వానించుచున్నాము ఎల్లరు విచ్చేసి సభను జయప్రద మొనరింప ప్రార్థితులు

రాజమండ్రి,
16-11-1981

కార్యనిర్వాహక వర్గము
హంపారు క్లబ్బు

---

## MAHATMA GANDHI HINDI AWARD

Mahatma Gandhi Hindi Award of Rs 1000/ will be given for the Original Hindi Works of South Indian Hindi Writers Published during the years 1965 70 Writers and Publishers are requested to send three copies of the books to Dr Saragu Krishna Murthy, Professor and Head of the Department of Hindi, Bangalore University, Bangalore 560056, on or before 31-12-1981

Dr Saragu Krishna Murthy,
Professor & Head of the Department of Hindi.

Chk 30-10 1981

---

అడ్రసు —

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
రిటైర్డ్ తెలుగు లెక్చరరు, వి టి జె కాలేజి,
6 8-7 ఇన్నీసుపేట, (త్యాగరాజ నగర్),
రాజమండ్రి - 1

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B V. & Co , Press, Innispet,